# విప్లవజ్యోతి



బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి



కర్త

కాష్టా వెంకట సుబ్బారావు

# విప్లవజ్యోతి

రచయిత

కుర్రా వేంకటసుబ్బారావు

అప్పికట్ల
గుంటూరు జిల్లా

# కృ త జ్ఞ త

ఈ కావ్యరచనలో కోరలిన సూచనలను నాకొసంగి, సరిదిద్ది, దీనికి, రూపురేఖలొసంగిన మద్గురు తుల్యులు "తెలుగు లెంక" శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారికి నామనఃపూర్వక కృతజ్ఞతాభివందనములు.

అడిగినదే తడవుగా ఈకావ్యమునకు 'పరిచయ' వాక్యములను రచించిన 'బౌద్ధవాఙ్మయబ్రహ్మ' శ్రీ చుగ్గిరాల బలరామకృష్ణయ్య గారికి నా నమస్సులు.

దీనిని 'సమీక్ష' గావించిన మన్మిత్రులు డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం యం. ఏ., పిహెచ్. డి. గారికి నా నెనరు.

రచయిత

# పరిచయము

హంస ఖండకావ్య రచయిత శ్రీ కుప్తా వేంకటసుబ్బారావుగారు నాకు ఆబాల్యమిత్రులు

పరిపూర్ణమగు జీవితానుభవమును గడించి, లోకమందలి అసంఖ్యాకములగు భావనా స్రవంతుల నీదులాడి, పరిపక్వము, తేజస్స్వాంతమునగు సంస్కారభావ ప్రపూర్ణుడయి ఏతత్కావి సకలలోక సంపూజ్యమగు ఇతివృత్తమును ఈ చిన్నికావ్యము నకు అధారము చేసికొనుట కడుంగడు సంస్తవనీయము.

# వేదకాలము

వేదములు వేదకాలము భారతజాతికి అనాదిసిద్ధములు, సంప్రాప్తములునగు అనంతజ్ఞానభండారములు. వీనిని కొందఱు పౌరుషేయములని, మఱికొందఱు అపౌరుషేయములనినుడువు దురు. అద్వైతసిద్ధాంతమునకు బుట్టినిల్లగు భారతావని జీవాత్మను పరమాత్మస్వరూపమునకు భిన్నముకాదని అనాదిగ తెలం చుటలేదా? అట్టి వేదములు ఆర్యసంస్కృతి ప్రాభవమునకు పట్టుకొట్లయినవి. వానికి బిదప ఉపనిషత్తులు, షడ్దర్శన ములు మున్నగు శాస్త్రమీమాంస గ్రంథరాజములు ప్రకృతి, పురుషుడు, పరమాత్మలగూర్చి సత్యాన్వేషణమునకు గడంగి నిరూపణకు కృషిసలిపి, అనంతశాస్త్రజ్ఞానజ్యోతిని సకల విశ్వ మునకు ప్రసాదించినవి. వేదములు, ఉపనిషత్తులు, దర్శన

ములు, స్మృతులు ఉద్భవించిన భారతవిజ్ఞానోద్యానవనమున పురాణకాలము నచ్చుపరికి కలుపుమొక్కలు విజృంభించినవి. మహోదాత్తము, మహోన్నతమునగు మానవతత్వసముద్రము, కిరాతకముపయి భ్రష్టరూపమును దాల్చి సర్వజన శ్రేయస్సునకు కల్యాణమునకు బదులు యానద్వారతానవిని మారణహోమమును సృజించినది. భక్తి, జ్ఞానము, శీలము, శాంతి, కరుణ వెలయవలసిన చోట దుష్కర్మ, పశుబలి, నరబలి, మూఢవిశ్వాసము విజృత్తలమునకెగసి దైవాంశ సంభూతుడగు మానవుని ఘోరరాక్షసుని గావించినవి.

"ప్రపంచమున ధర్మమంతరించి అధర్మము ప్రబలినపుడు భగవంతుడు భువిపయి నవతరించి ధర్మ ప్రతిష్ఠాపనము గావించును, అధర్మమును రూపుమాపును. విలయ తాండవమునకు కారణభూతులయిన నరరూపరాక్షసుల పీచమడంచి దుష్ట సంహార పరముగ శిష్టసంరక్షణమునకు భగవంతుడు కంకణబద్ధుడగును" ఇది భారతీయుల విశ్వాసము. భగవద్గీత అనాదిగ భారతావనిని గొంతెత్తి చాటిన పరమసత్యమును నదియే.

దయాసముద్రుడగు బుద్ధుడవతరించునాటికి భారత భూమి పాపపంకిల గ్రస్తమయి నానాదుష్టమతదూషితమయి మానవతా సంహారకమగు నీచకుల ద్వేషాగ్నికింధనమయి కర్మకాండ పేరిట హత్యలతో, యుద్ధములతో, పరస్పరపీడనముతో పైశాచికభూమిగ ఆరవరాని పాపానల జ్వాలలక్రింద దహనమగు చుండెను. దీను

డగు మానవుని ఆర్తనాదము భూనభోంతరాళముల మారుమ్రోగసాగెను, దైవాంశసంభూతుడగు మనుష్యుడు వధ్యుడయ్యెను. నిషిద్ధము ప్రసిద్ధము కాగ, అధర్మము గ్రాహ్యమగుచు ధర్మము పరిత్యాజ్యమయ్యెను. పశుపత్యాదులకంటె విజ్ఞాన ఖనియగు మనుజుని బ్రతుకు పాటలు వెతలపాలయ్యెను. అట్టిచో కరుణాసముద్రుడగు బుద్ధభగవానుడు పతితమానవోద్ధరణకయి ఉద్యమెత్తెను. పుట్టినింట మెట్టినింటకంటె వాత్సల్యముమిక్కుటముగనుండుట నైసర్గికము. భక్తిజ్ఞాన, ప్రేమ, కరుణారసార్ద్రమగు బుద్ధధర్మము పుట్టిన భూమినుండి దిక్కులేని సతివలె భూతభూమినుండి తరిమి వేయ బడినది. బౌద్ధమతము భారతదేశమున వెంటాడబడి, వేటాడ బడి విధ్వంసము చేయబడలేదను నుడువు ప్రాజ్ఞులెందఱోకలరు. శంకరుని అద్వైతవాదమునకు ప్రచ్ఛన్నబౌద్ధమను పేరుకలదని వారు వాకొందురు. బుద్ధదేవుడు ఏ అహింసను, కరుణను, శీలమును, శౌచమును, త్యాగమును, దివ్యమానవునిభవ్యతను తన ధర్మశంఖారావముచే జగతికి జాటెనో ఆసద్గుణమణులన్నియు శంకరమతమందు లీనమయి పోయిన వనియు, తత్కారణముగ బౌద్ధమతావశ్యకత-రామావతారమునకు పిదప పరశురామావతారము యొక్క ప్రాముఖ్యము, ఆవశ్యకత నశించునట్లు- అంతరించినదనియు ఈమతతర్కవాదులు, అతితెలివితేటలతోనుడువుటయుగలదు. చలిచీమనేని కాలిక్రింద ద్రొక్కుటకువెఱచిన, ఒకచిన్ని పూవునేనిపుణికిన పాపమని జంకుగుండె కలిగిన జితేంద్రియులు, సర్వసంగపరిత్యా

కులు, అహింసాధర్మప్రచారకులు, జాతిమత భేదముల విధ్వంస మొనరించిన బౌద్ధసన్న్యాసుల నల్లులను మాడ్చి వేసినట్లు శంకరుని మతజ్వాలమున సర్వతోముఖసంహారముగావించుట కేప్రాజ్ఞులేమి కారణము చూపగలరో దురూహ్యము!

## నేటి హేతువాదులు

బౌద్ధమతము మానవజాతి యందలి రాక్షసత్వమును నిర్మూలించినది. దయాదాక్షిణ్యముల పెంపొందించినది. సర్వేసర్వత్ర అహింస మూడుపూవుల ఆరుకాయల పెంపెసలారినది. కామ, క్రోధ, మదమాత్సర్యాదులు అణగంటినవి. కాని పులుసుచచ్చిన చింతవలె పురుషుని యందుగల మగటిమి క్షాత్రముఅణగంటినవి. సింహకిశోరమువలె శాత్రవానీకము పయిలంఘించి, వారి పీచమణంచి చీల్చిచెండాడగల పరాక్రమ నిధి యగుభారతవీరుడు భీరువయి అహింసపేరిట పిఱికి పందగ రూపొందినట్లు వీరుగర్హింతురు. బుద్ధునికరుణావాదము భారత జాతిని నిర్వీర్యమొనరించినదని వీరుద్ఘోషింతురు. ఏతత్ నిర్వీర్యతకారణమున భారతజాతి చేవనుగోల్పోయి పరజాతి గ్రస్త మగుటకు ప్రబలహేతువని వీరెనుదురు. ఈవాదములన్నియు తమ తప్పును కప్పిపుచ్చుకొనుటకు కించిజ్జ్ఞులు చేయుతర్కవిహారమగు కుటిల కపట వాదమని నావిశ్వాసము. బౌద్ధధర్మమునే

భారతీయులందరును మనసా, వాచా, కర్మణాశిరసావహించి యుండిన భారతజాతి కుల, మత, భేదములులేక కొందఱస్పృశ్యులుగాక సామాన్యవిద్య, బ్రహ్మవిద్య నూటికి అయిదుగురి హస్తగతముగాక నూటికి నూరుగురు విద్యా విజ్ఞానప్రాభవోద్వేలసితులయి భారతజాతి అజరామరముగను భారతభూమిని దివ్యస్వర్గసీమగను, సకలమానవాళికి, సకలలోకమునకు విశ్వ విజ్ఞానవిశ్వకళాపరిషత్తుగను మార్చి యుండెడిది. అల్పసంఖ్యాకులు స్వార్థాంధులై జన్మతో కులాధిక్యతను పొందించుకొని, విద్యను గుత్తగొని జాతులు కులములు వివిధశాఖలుగ వర్ధిల్లి పరస్పరకలహములకు లోనయి నిరతము తమ్మాశ్రయించునట్లు చేయుటవలననే భారతజాతి దుర్గతికి పాల్పడినది.

నేటి secularism బుద్ధధర్మమందలి ప్రధానాంశమగు అహింసనే ఆరాధించి నిత్య జీవితమున అనుష్ఠింపజేసి, దుష్టపాలక శక్తిని నిర్జించిన గాంధిమహాత్ముని సత్యాగ్రహోద్యమమునకు స్వాతంత్ర్యమును ప్రసాదించినది. మన స్వాతంత్ర్యము యొక్క ఆదర్శములు, నీతులు, లక్ష్యములు, మహోన్నతములు, కాని ఆచరణము మాత్రము నేడు శూన్యమైనది. కుల మతాతీత ప్రభుత్వమును స్థాపించిన కాంగ్రెసు పరిపాలనలో నేడున్న కులమత ద్వేషములు మహమ్మదీయ సామ్రాజ్యమందేని మనము కనియుండము. నాడు "అల్లాహో అక్బర్" "హర్ హర్ మహదేవ్" అను యుద్ధ నినాదములతో భారతీయులు రెండుగమాత్రమే విభక్తమయిరి. కాని నేడో మహా

త్సుకుంతగ జాతి, మత, కులరాహిత్యమునకు కృషిసలిపి నను నేను అడుగడుగున భారతీయ జీవన ప్రాంగణమున ధర్మాంగణమున సాహిత్యీసీమయందు, సాంఘికక్షేత్రమందు, రాజకీయ వ్యోమమునందు కులము కోటిపడగల విషసర్పముగ తలయెత్తి తన విషపూరిత ఫూత్కారముల పలుదిశల విసరివైచుచున్నది. దీనిని తుదముట్టింపనిదే మనము మహనీయుల రక్తధారలచే సంపాదించిన స్వారాజ్యము సామ్రాజ్యముకాక భోగపరరాజ్యముకంటె మనకు దుఃఖమును, దారిద్ర్యమును, అవిద్యను, అశాంతిని ప్రసాదింపగలదు. సీచభావ సంక్షుభితము, కులతత్వ దూషితము, దురహంకార పూరితము, అవిద్యాంధకార బంధురము, పరస్పర పీడనాసక్తము, నిత్యస్వార్థ సంపాదనాయత్తమునగు నేటి భారతావనికి కావలసిన దేది?

## దివ్యసందేశము

ఒక దివ్యతేజోరాశి, ఒకమహనీయమార్తాండ తేజోవిలాసి. ఒక అనన్యసామాన్య దయాదాక్షిణ్యాంబుధి, ఒక అరిషడ్వర్గ విజేత యగు భగవదంశ సంభూతమహావ్యక్తి దివ్యనామము దివ్యరూపము, దివ్యవాణి మనకే తరుణమున ప్రత్యక్షమగునట్లు చేయగల శిల్పి, గాయకుడు, రచయిత, కవి, నక్షత్రధన్యుడు. నా

మిత్రుడు సుబ్బారావుగారు ముదిమి పైబడినను ప్రియసతీవియోగమున క్రుంగినను తన ఆత్మకు, లోకాత్మకు శాంతిసంధాయకంబగు నీఖండకావ్యమును భాషామతల్లికి పూజాకుసుమంబుగ సమర్పించుట కడుంగడు ముదావహము. పాతవడి, సన్నగిలి పనికిరాని, కంపుగొట్టు తలంపులపయిన, చింతలపయిన అలవాటులపయిన జరుపబడు తిరుగుబాటు నేఁడు విప్లవమందుచు, తత్ విప్లవ పర్యవసానము పురాతన తిమిరావళిని పారద్రోలు దీపావళి కాగలదు. విప్లవజ్యోతియని శ్రీసుబ్బారావుగారు ఈఖండ కావ్యమునకు పేరిడుట సముచితమే. వీరు సహృదయులు; సంస్కారులు; సరసులు. వీరి కవిత్వము మృదుమధురమయి, సరళమయి హృదయము నత్తుకొనఁగల ద్రాక్షాపాకమునందుండుట సంతసింప దగినవిషయము. వీరి రచనయందు ధారాశుద్ధి, స్పష్టభావప్రకటన, శిరీష కుసుమ పేశల పదగుంఫన కుంటువడని శైలి స్పష్టముగ అనేక పద్యములందు గోచరించుచున్నవి. వీరీ ప్రాయమున ఇట్టిమహోదాత్తభావబంధురములగు రసవత్తరకావ్యములు రచింపఁబూనుట ఎంతేని వాంఛనీయము. మఱొక్క విశేషము. విద్యాదాతయు, నిరతాన్నప్రదాతయు ఉదారులునగు శ్రీ సీతారామయ్యచౌదరి గారికి తన అమూల్యమగు ఈచిన్ని కావ్యమును అంకితమొనర్చుట పసిడికి తావి అబ్బినట్లున్నది.

బౌద్ధవాఙ్మయబ్రహ్మ,
దుగ్గిరాల బలరామకృష్ణయ్య

# స మీ క్ష

డా॥ బొడుపల్లి పురుషోత్తం యం. ఏ., పిహెచ్. డి.

ఇది 'విప్లవ జ్యోతి' కావ్యము. కర్త శ్రీ కుర్రా వేంకట సుబ్బారావుగారు. వీరు మా ఆంతరంగిక మిత్రులు. శ్రీ సుబ్బారావుగారు నన్నీ కావ్యమును సమీక్షింపుమని ఆదేశించిరి. ఇది గుర్వాజ్ఞతో తుల్యమైనది. ఈసమీక్షకు తగిన దక్షత నాకు లేదని తెలిసియు, గుర్వాజ్ఞను త్రోసిపుచ్చు ప్రత్యవాయముునకు పాల్పడ కుండుటకే ఈపని కంగీకరించితిని.

బౌద్ధమత ప్రభావము తమిళ, కర్ణాటసాహిత్యములపై బాగుగా ప్రసరించినది. నన్నయకు పూర్వమందున్న ఆంధ్ర వాఙ్మయమిట్టి ప్రభావమునకు లోనైనదేయని, ఆర్యమతాభిమానులగు నృపాలురు దానిని నశింపఁజేసిరనియు విశ్వసించువారీ దేశమున పలువురున్నారు. వివాదాస్పదమైన ఈవిషయ మిట్లుండ, చెప్పవలసినసత్యము, అద్యత నాంధ్రకవిప్రపంచ నిర్మాతలగు శ్రీ తిరుపతి వేంకట కవులే తొలిసారిగా బుద్ధ భగవానుని దివ్యజీవితమును రమ్య ప్రబంధముగా ఆంధ్రావని కందించిరనుట. ఆ పిమ్మట వారి యంతేవాసులు శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారలు సర్వాంగసుందరమగు 'సౌందరనందము' ను మహాకావ్యరచన

గావించిరి. శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి 'కరుణశ్రీ' కాకమునుపే కొందఱు 'జాతకకథలి' తివృత్తముగా స్వీకరించి లఘు కావ్యరచన లొనర్చిరి. ఏవం విధముగా ఆధునికాంధ్ర వాఙ్మయమునందు బౌద్ధవాఙ్మయ మొకశాఖగా విస్తరించుట ముదావహము. ఏతచ్ఛాఖను పూచి వికసించిన కావ్యకుసుమ మీ 'విప్లవజ్యోతి'

కావ్యరచనకు చిత్తశుద్ధి ప్రధానము. తానుబాగుగా విశ్వసించుభావములనేకవి, లోకమునకు హత్తుకొనునట్లు చెప్పగలడు. కొందఱకట్టి విశ్వాసములేకున్నను, మాటలగారడీచే ఉన్నట్లే నమ్మకము గల్గింతురు. శ్రీ సుబ్బారావుగారు పరిపూర్ణముగా బౌద్ధమతమును విశ్వసించిన వారనుటకు నిదర్శనమిప్పటికి కొన్నివసంతములుగా వారు జరిపించుచున్న, జరిపించనున్న బుద్ధజయన్త్యుత్సవములే. ఇట్టిపరిశుద్ధవిశ్వాస జనిత భావావేశము తోడనే వారీ 'విప్లవజ్యోతి'ని వెల్గించి, వెల్గించి యిప్పటికి వెలువరించిరి. ఇందలి ప్రతి పద్యమీజ్యోతికి వెల్గొనగూర్చు ఒకవత్తి. ప్రతిపద్యము, అందలి ప్రతిపదము నుపరిష్కృతము. "సంస్కృత్య సంస్కృత్య పదాన్యుత్సృజ్యన్తే" అన్నట్లే జరిగినది.

జీవిత చరిత్రను కావ్యవస్తువుగా స్వీకరించి, కావ్యము నిర్వహించుటలో ఎన్నో క్లిష్టతలున్నవి. కొన్ని విషయములు కేవలము చరిత్రకు సంబంధించినవి. అవినీరసములు. అవి చరిత్ర

కారులకు వదలఁదగినవి. పోగా భావప్రధానములై పఠితలకుత్కంఠ గల్గించి, హృదయములనుప్పొంగఁజేయు సంఘట్టనములనే కవి తన ప్రతిభాచక్షువుచే దర్శించి, యథారూపమునొసంగ వలయును. శ్రీ సుబ్బారావుగారు రసవత్తరములగు సన్నివేశములనే గ్రహించి 'అనాథ' 'పురయాత్ర' 'మథనము' 'నిర్ణయము, 'సంఘర్షణ' 'ఫలితము' అను శీర్షికలేర్పఱచి సమర్థముగా నీకావ్యమును నిర్వహించిరి.

సుందరమగు తెనుఁగు కవితోద్యానమున మత్తేభములు శార్దూలములు ప్రవేశించినవి. చిందర వందర గావించినవి. వానిని శాంతింపఁజేయుటకు కవులను సర్కసు వారికి తలప్రాణము తోకకు వచ్చినది. ఎక్కడి ఆకు అలము, ఆహారము వానికి చాలదు. అందుచేతనే కాఁబోలు ఈవృత్తములనొక ఉద్యమముగా ఆధునిక కర్ణాటకవులు పరిహరించి, దేశీయమగు ఛందస్సునే సమాదరించుచుండిరి. తమిళ కవులకసలా బాధయే లేదు. తెనుఁగు కవులిట్టి దొక యుద్యమముగాఁ జేపట్టుటలేదు. కారణము వారిలో చాలమందికి భాషాదారిద్ర్యమున్న దన్న అంగీకరింపరు. ఏలన భాషయున్నచోట భావమెట్లుండకుండునని వారు ప్రశ్నింతురు. ఏదో భావమున్నంతట వేఱు. అనుకున్న భావమేనిగ్గుతేలి నిగనిగ లాడుట వేఱు. మొత్తముమీఁద శ్రీ సుబ్బారావుగారు జాను తెనుఁగు దీప్తితో దేశీయమగు ఛందస్సులో తొలిసారిగా దేశభాషలో దివ్యప్రబోధమొనర్చిన కరుణారసమూర్తి యగు బుద్ధభగవానుని విప్లవస్వభావమును ఆట

వెలఁదులచే గీతగీతులాలాపింపజేసి ఉన్మీలించి సంపులకు వారిని మిక్కిలిగా అభినందించుచున్నాను. ఇది యాబాలగోపాల మానసందాతిరేకమున చమత్కొనవలసిన కావ్యము సద్యః పరనిర్వృతి కష్టవచ్చు పదాడంబరమింపు మృగ్యము. ఆనాటిసిద్ధార్థునితోపాటు మనము దుఃఖావహమగు పురయాత్ర చేసిఁ భావసంఘర్షణమునంది కడకు బుద్ధులమై ఆత్మశాంతిననుభవింపఁ గలము. అస్తు!!

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి."



కృతిభర్త:

శ్రీ మన్నె వేంకట సీతారామయ్యగారు

కోడూరు - కృష్ణాజిలా

# సమర్పణము

వేంకటసీతారామ స
దాంకిత శుభనామ ! చిలుకమాంబా హృత్స
ర్యంక సుఖతృప్త ! వాఁడె
కింకరసంతుష్టి కరణ కృత్యప్రవణా !

కమ్మకులమ్మునన్ గొడుగట్టిన శౌర్యము కుమ్మరించి దే
శమ్ములనేలి పాలితుల సన్నుతులన్ గయికొన్న మన్నె వం
శమ్మున నుద్భవించిన ప్రజాహిత జీవన ! నీ యశస్సు లో
కమ్మునఁ బండువెన్నెలలుగాయుత ! సర్వజనప్రియమ్ముగన్

వీరావేశము పొంగి ప్రాణముల నిర్భీతిన్ సమర్పించు స
ర్దారుల్ పుట్టిన పోతుగడ్డ కద నీ గ్రామంబు కోమూరు; నీ
ధీరత్వంబు తదీయదీప్తిని సముద్దీపింపఁగాఁ జేయుమం
దారశ్రీ సుమరాజిచల్లు నఖిలాంధ్ర క్షోణి నీ యాదలన్

మన్నెహం వీరసంతతిన్ మానధనులు
త్యాగశీలురు వీరులు ధర్మపరులు
భోగులు విరాగులెందఱో పుట్టి కీర్తి
నాఁచికొన్నారు ధన్యతాశ్రీ చెలంగ

తల్లిదండ్రులు ధర్మతత్పరత యలర
నుద్దిలేని బిడ్డగ నిన్ను దిద్దితీర్చి
రుత్తమంబగు శిక్షణ రిత్తవోక
సత్ఫలంబుల నిడునన్న సాక్షిపేవె.

తల్లి పేర్నిలుప నాంధ్ర లయోల కాలేజి
సదనంబులో నొక గదినమర్చి
ఆత్మజస్మృతి హేతువగునట్లు కోడూరి
కంచిత విద్యాలయం బొసంగి
నిరుపేదలగువారి నెగులు దూరముగాఁగ
వందల యెకరాల వసుధపంచి
విశ్వకళ్యాణేచ్ఛ వెలయఁ గౌతుకబంధ
యుతులుగా నెందఱినో యొనర్చి
చిల్లిగవ్వయులేక ఘోషించుచున్న
కట్టువాండ్రకుఁ జదువుల కొఱఁతదీర్చి
రాణకెక్కిన నీ యుదారత దలంపఁ
బరిసర గ్రామముల కహో! పండ్లు పులియు

అన్నిరీతుల నీకు దీక్షైనచాన
చేకుఱెన్ గద పత్నిగాఁ జిలుకమాంబ
గుడులకుం గూపములకా రి గుడుచు పేద
కీ నెలంతుక వెచ్చించు వేనవేలు.

మంచిమగువ వారికై, సుహానీయసంపద
రయొందవో, మేలిబిడ్డ లుదితులైరి
కుసుమహాసినివై గొప్పగుణములు నీకు; నీ
చెముప్పు స్పృహాపలుకులకు నొజ్జబంతి.

నీతో నా కబ్బిగ సం
గాతం బెన తేని తృప్తి కల్గించెను స్వా
ర్థాతీతము నీ ప్రేమం
బేతద్గుణ మీ జగాన నెందఱకుండున్!

నిష్కళంక మైన నీ మైత్రి కెంతయుఁ
దనిసి మత్కృతజ్ఞతను వెలార్ప
మార్గ మెద్దియుంట మదినెంచి యెంచి యీ
కృతిని నీకుఁ గాన్క యిచ్చుచుంటి.

'విప్లవజ్యోతి' యిది. దయానిధుఁడైన
బుద్ధభగవాను కథ యిది, శుద్ధజీవ
నానురాగము కలవారి కహరహమ్ము
పాఠ్యమిది శ్రేష్యమిది నీతిపాత్రము నిది.

ఏమివింత! బుద్ధుఁడీవును వైశాఖ
పౌర్ణమాసినాఁడె ప్రభవమంది
రిదియె నిక్కమైన హేతువుకానిచో
నింతయోర్మి నిన్ను నెట్లువలచు

ఈ కబ్బము నీ కంకిత
మై కనకమ్మునకుఁ దావియమరిన కరణిన్
లోకనుతి పాత్రమయ్యెను
నీకీర్తి పతాకయయ్యె నీతిజ్ఞమణీ !

ఆ నాఁడు

వైదికాచారముల విజృంభణకు లోఁగి
పాలకులె ధర్మదూషకులై బైసిమాలి
క్రూరకృత్యములకు జంకుగొంకు లేక
పాల్పడిరి దిక్కుమాలిన భారతమున.

శ్రుతులు మను గౌతమాదికస్మృతులు కూర్చి
కర్మసిద్ధాంతమను బురఖా నమర్చి
కులమతాచారముల రగుల్కొలిపి ఋషులు
నిలిపి రార్యపతాకముల్ నింగిముట్ట.

ఇంటిలో నాల్గుతడికల నిడిన యట్లు
నాల్గు తెగలేర్పరించి మానవులఁ జీల్చి
రగ్రకులమిది యది యధమాన్వయం బ
టంచు భేదప్రవృత్తికల్పించి రపుడు.

సేవ్యుఁడతఁడు వీఁడు సేవకుఁ డనిరి దా
స్యంబె నీవిధిహిత సరణి యనిరి
అంతతోడ నిల్వకైదన తెగనొండు
కూర్చి దానినంటఁగూడ దనిరి.

గుణములు కర్మంబులు కా
రణములుగాఁ వెగలనేర్పఱచితి మటంచున్
మునుపల్కిరి గాని పిదప
జననంబే హేతువనిరి సాహసమెగయన్.

అగ్రకులజుని దూఱుట యతని కెగ్గు
సేయఁదలఁచుట యతఁడెట్టి చెనఁటియైన
మందలించుట శాస్త్రసమ్మతము గాని
చర్యలని నిర్ణయించిరి శాసనములు.

స్వర్గమని రంభభోగముల్ వలసినన్ని
కుప్పతెప్పలుగాఁ చేకుకొని సతంబు
వచ్చిపోవు సోమాసుల వాంఛితములు
తీర్చి యానందమున ముంచి తేల్చు ననిరి.

యక్షగంధర్వ కింపురుషాది సురలు
రంభయూర్వశి మేనకారమణి హరిణి
నందనోద్యానము శచీపురందరులు బృ
హస్పతియు దిక్పతులు నుందురనిరి విని.

జన్నమను పేర జంతుహింసనుఁ గడంగి
యామిషము మెక్కి మద్యంబు నారగించి
యాజిపట్టంబుగొన్న మహాశయుండె
యప్సరసతోడఁ గ్రీడింప నర్హుఁడనిరి.

అంతియోగాదు సననంబు నాచరింప
నింద్ర వరుణాగ్ని దేవత లీప్సితములు
కూర్చి స్వర్గపురాధీశు కొలువునందు
దివ్య సభ్యత్వమును బ్రసాదింతురనిరి.

శాస్త్రమనలఁ ద్రోసి జపము తపమ్ముల
నాచరించు శూద్రు నవనిపతులు
చంప నీశ్వరుండు సకలసుఖమ్ములు
పంచి వారి నుద్ధరించు ననిరి.

x x x

మానవసమాజము విభిన్నమార్గములను
ద్రొక్కఁగాఁజొచ్చె శాంతికి దూరమాయెఁ
గలహములు రేఁగె స్వార్థంబు కన్నుగప్పె
నీశ్వరునిపేర హింసా ప్రవృత్తి రేఁగె.

స్వర్గసుఖము నపేక్షించు త్మౌతలేంద్రు
లప్సరస పొందుగోరెడి యుగ్రకులులు
చంపుచున్నారు వేలు లక్షలుసతమ్ము
మూఁగజీవుల జన్నంపు ముసుఁగు గప్పి.

జాతివిద్వేష మెగసెఁ బ్రజాహితమ్ము
మంటఁగలసె నల్దిక్కులు మాఱుమ్రోయ
ఘోర సంగ్రామములు పెచ్చుమీఱె నాఁడు
దేశ మగ్నిపరీక్షతో దిమ్మఁదిరిగె.

ముక్కచెక్కలగుచు ముక్కోటి రాజ్యము
లుద్భవించె భారతోర్వి యందు
విప్లవములఁజిక్కి వెతనందుచే గాక
సంఘమునకొకింత శాంతిలేదు.

# పుర యాత్ర

శాక్యకులుఁడు శుద్ధోదన చక్రవర్తి
యాజ్ఞ నౌదలఁ దాల్చి రమ్యాకృతిగ నఁ
లంకరించిరి నగరపాలకులు కడఁగి
రాజధానిని నేఁడు స్వర్గంబుగాఁగ

కపిలవస్తుపురము కళకళలాడెను
వీథివీథిఁ గాంతి విరిసె; జనము
లెదురుచూచుచుండి రెవ్వరిరాకనో
యభిలషించి యొక్క నాశ్రయించి.

పురముఁ జూచుకోర్కె నెఱిఁగించి గురుని సం
శ్రవము వడసెనంట క్షత్రవంశ
జలధిచంద్రుఁ డైన సర్వార్థసిద్ధుండు;
వానికొఱకె యిట్టి వైభవంబు.

మాఱు మ్రోయుచుండె మంగళవాద్యముల్
రాజవీథిఁ బ్రజలరవళి హెచ్చె
నరదమందు నధిపుఁ డాసీనుఁడై యుండె
మొయిలువిడిన భానుమూర్తివోలె

చిఱునగవు ముద్దుమోమునఁ జిందులాడ
శాక్యసింహుఁడు సంతోషజలధి మునిఁగి
సంభ్రమాశ్చర్య వికసితస్వాంతుఁ డయ్యె
జయజయధ్వానములఁ జేయుజనులఁ గాంచి

x x x x

బాలసిద్ధార్థు జాతకఫలము గాంచి
యసితముని వివరించె సన్యాసియై జ
గంబున కితండు మోక్షమార్గమ్ముఁ జూపు
తత్త్వవిజ్ఞాని యౌనని తండ్రితోడ

నాఁటినుండి ఱేఁడు కోటగోడలలోనె
నిలిపియుంచె భోగములను బెంచెఁ
బంజరమునఁ ద్రోసి బంధించు వన్నెల
రామచిలుకరీతి రాకుమారు.

సతత మానందవికసితస్వాంతుఁ జేయు
నృత్య నాటక గాన సాహిత్యకళల
నాఱితేఱిన బహుళవిద్యాధురంధ
రులను నియమించె విజ్ఞానరుచి స్ఫురించె.

శాస్త్రచర్చ లన్న సంబరపడుఁ గాని
యితర మెల్లఁ డీ మహీంద్రుసుతుఁడు
చిత్తమందు మధురజీవితమర్మంబు
లెఱుఁగ సతము నుత్సహించుచుండు.

నాట్యకత్తె లాకట నర్తింపఁ జెలువలు
సరసభాషణములు సలుప వినియుఁ
గలఁతచెందఁ డొక్కపలుకైనఁ బలుకఁడు
ధ్యానమగ్నుఁ డైన తపసిపోలె

భూవరుండు సుతునిభావంబు పసిగట్టి
సుందరాంగి నఖిలసుగుణనిధిని
రాణిఁగా యశోధరాదేవిఁ గొనితెచ్చి
యాత్మజునకుఁ బరిణయం బొనర్చె;

తొలుత గౌతముండు నలపించి ప్రియురాలి
హృదయమున కొకింత ముదము గూర్చె
దినము లరుగ నతనియనురాగబంధమ్ము
సడలఁ జొచ్చెఁ బ్రేమ ముడుఁగఁజొచ్చె.

నవవసంతవేళఁ జివుఁపలఁ దిని క్రొవ్వి
కోకిలమ్మ కూయు కుహూకుహూలకు
మది చలింపనీఁడు మనుజేంద్రతనయుండు
శాంతచిత్తుఁ డైన సాధువట్లు.

మలయపర్వత శీతలమారుతంబు
సోఁక విరిసెజ్జ గాఢసుషుప్తి మునిఁగి
'ఆత్మవత్సర్వ భూతాని' యనుచు వేదా
కలవరించు ముముక్షువుకరణి జేఁడు.

తళతళత్కాంతి దిగ్దిగంతముల నొరసి
తఱిపివెన్నెల వలపులవికులు కురియఁ
బూలతోఁటల వైరాగ్యబుద్ధి నితఁడు
కడపుఁ గాలంబు నుత్తమ జ్ఞాని కరణి.

మగనియెడఁద రేఁగు మమకార మెట్టిదో
యాకళింపు గాక యతివ పొగిలె;
పతి విరాగి, రాగపరిపూర్ణ సతి; పిరి
నెయ్య మెన్నినాళ్లు నిలువఁగలదు ?

కొలఁదియేండ్లు కడచె నెలదప్పె యువరాజ్ఞి
కవతరించెఁ జిన్నియర్భకుండు
దానములను బ్రజలఁ దనిపె శుద్ధోదన
పార్థివుండు ధర్మబాంధవుండు

అంతిపురములోనకాంతలు సిద్ధార్థు
విడిది కరిగి విన్నవించుకొనిరి;
"అయ్య ! దేవిగారి కతిలోకసుందరుఁ
డాత్మజుండు పుట్టె" ననుచు భక్తి.

సారరహిత భయద సంసారబంధమ్ము
ద్రెంచుకొనఁగ నుద్యమించునాకు
బంధనమ్ము మీఁదిబంధనమా యిది
యనుచు రాచపట్టి యార్తి నందె.

ఉల్లమందు నేమి యూహించెనో వాని
మొగమునం దొకింత నగవు లేదు
విన్నఁబోయి యతఁడు చెన్నుని రావించి
కన్నతండ్రి కేదొ కబురు పంపె.

చెన్నుఁ దరిగి ప్రభునిసన్నిధిఁ బుత్రుని
పురము విడుగు వాంఛ నెఱుకపఱచె
ఇచ్చవచ్చె విభుండు మచ్చెపుటలు గ్రమ్మ
నసితపూనిమాట యతనిఁ గలఁచె,

సుతునివిన్నపంబు పిత శ్రోయఁగాలేక
యానతిచ్చె నగరమందుఁ దిరుగ
నశ్వరాజములను నదలింపఁ జెన్నుండు
తేరినొగల మొదలఁ గూరుచుండె.

X X X X

భరతనాట్యపటిమ ప్రబ్బిననర్తకి
నిచటు మభినయింప నిలిచె నెదుట
నవవధూటి రాజనర్తకి వ్రూదండ
వైచి సుగతునకు నివాళిచెసెఁగా.

సాగె జైత్రరథము సంసారజలనిధి
దాఁటు వెరవు గనక తల్లడిలు
ప్రజల నుద్ధరింపఁ బ్రకృతిదేవత హృది
పొంగి మోదబాష్పములను విడువ.

ఉత్సవంబుఁ జూడ యువతు లుప్పరిగలఁ
జేరి విరులు గురియ సిద్ధమైరి
వెల్లగుజ్జములను మెల్లన చెన్నొందు
నగరి వీథులందు నడపుచుండె.

ఆకసంబు నంటు హార్మ్యంబులను, బాల
జాతిచప్పరములఁ బూఁత పూచి
కనులపండువై సుగంధమ్ము లెగఁబోయు
తోఁటలను దథాగతుండు కనియె.

కలయఁ జూచుచుండె నలుగెలంకుల విజ
యధ్వజంబులను బురావనీంద్ర
దానశాసనముల ధర్మశాలల శాస్త్ర
విమలచర్చ లెగయు వేదికలను.

పఠనమందిరములు, ప్రాఁజనువ్వుల పాఠ
శాల, లక్ష్మీమనోజ్ఞ జలజకాంతి
క్రమ్ముకొన వెలుంగు కాసారములు రమ్య
భంగిమములఁ బొల్చు ప్రతిమలు గని

జంత్రగాత్రమధురసంగీత సాహితీ
నిలయములు విచిత్రకళల నేర్పు
పల్లెసూటముల విభాసితరత్నా
గారములను బెక్కుఁ గాంచె నృపుఁడు.

పలుచవాటికె నుత్సవప్రజ పత్తన
పరిసరములఁ దేసు తిరుగుచుండె
నశ్వములను మలఁప నాయత్తపడెఁ జెన్నుఁ
డంత నధిపుఁ డరద మాఁపు మనియె

తల్లడిల్లి గుండె జల్లనఁగాఁ జెన్నుఁ
డరద మాఁపి ప్రభునియాజ్ఞ నెఱపెఁ
గారణంబు తెలియనేరక వెనుచూచె
తిచ్చవడి నలంగు జేనిఁగాంచె

x x x

చెన్నుఁడా! యీతఁ డెవ్వఁడో చెప్పు మితని
నడుము వంగెను, శీర్షంబు వడఁకుచుండె
నడుగు తడఁబడ మార్గంబు తడవుకొనుచు
నడచెడిని వీఁడు పరమదైన్యమున మునిఁగి.

బోసినోరు, దంతములు లేవు, గుంటలు
పడియెఁ గనులు, గిడసబాఱె మొగము,
కురులు నరసె. వంకకోల చేపట్టి, నే
నిట్టినరుని జూడ వింతనట్టు.

చిన్నగవు నవ్వి చెన్నుండు "దేవరా !
భీతి నొంద నేమిహేతు ? వితఁడు
ముదిమిఁ బ్రొద్దు లేలు ముదుకండు దీనిలో
వింత యేమి ? స్వామి ! వినఁగవలతు.

ముదిమి యన నేమి ? యది యెట్టు లొదవు ? యౌవ
నమున మిసమిసలాడువర్ణము కృశించి
నలఁగిపోవునె ? యిద్దానఁ గలుగునొవ్వు
లెవ్వి ? చెన్నుఁడా ! నా కెఱిఁగింపు మన్న !

నిగనిగలఁ గేరు శ్రావణనీరదంబు
మిసిమివెన్నెల నోప్రభూ! మ్రింగినట్లు
మిసమిసలఁ దేఱు నెమ్మోనిపసను జెఱచి
ముదిమి చెరలాడు నవసానమును వరించి

కనులు కానఁబడవు వినరావు వీనులు
మోము గోముదక్కి ముడుఁగు వపుసు
కురులు నరయు నడుము క్రుంగు మై దిగజాఱి
వాడి వణఁకుపుట్టి గోడుగుడుచు

కన్నకొడుకు కసరు గారాబుననుమలు
నీసడించుకొంద్రు, చేసికొన్న
భార్య విసువుచెందు, బందుగు లొక్కరుఁ
దఱియరారు ముసలితనము నందు

సర్వజీవులకును సహజ మీ వార్ధక
మధిప! వయసు ముదుర నిది ఘటిల్లు
నెల్ల రీసడించు నీజరాభారంబు
తప్పుకొనఁగ నెవనితరముఁ గాదు

చిత్తవిభ్రమ మొదవెనో చెన్న! తేరు
మరలుపు మిదేమి యిచ్చోట మనుజు లేదొ
మోసికొనిపోవుచున్నారు మోములెల్ల
దుఃఖదగ్ధము లైనట్లు తోఁచుచుండె.

ఱొమ్ము మోఁదుకొనుచు రోదించు నీమె యీ
తరుణి కేమికీడు దాపరించెఁ
బజ్జఁ జేరి యేడ్చుపడఁతుక లెవ్వరో
చెప్పవయ్య! యీ విచిత్రగాథ.

తల్లిదండ్రు లేడ్వ దారసుతాదుల
గుండె లవియఁగా నితండు తనదు
పొలము తలము గేహమును వీడి నొంటిగా
స్వర్గమేగు బాటసారి స్వామి!

కట్టుకొన్న భార్య కాంతునిస్మృతి గాంచి
గుండె బాఁదుకొనుచుఁ గుమిలియేడ్చెఁ
గొలఁదిదినము లిట్లు విలపించి ప్రొద్దులు
కడవఁ గడన శాంతిఁ బడయు నీమె

బ్రదుకు నిత్య మనెడిభ్రమఁ దగుల్కొని జీవి
చేయరానియెగ్గుఁ జేయుఁ బ్రజకు
బ్రదు కనిత్య మనెడిభావంబు పొడచూపఁ
గ్రుంగి కుమిలి ప్రాణి కూలిపోవు.

బ్రతుకు చెల్లుదాఁకఁ బ్రజలను హింసించి
మోసగించి ముల్లెమూటగట్టి
పోక యేని వెంట రాక దుర్యశమును
విడుచు లోకమునకు వెఱ్ఱిజీవి.

ఈవిచిత్ర మేమొ యెన్నేండ్లు బ్రదికినఁ
తనువు విడుపు సమ్మతమ్ము గాదు
మాయజీవి కింతమమకార మేటికో
దుఃఖసాగరమునఁ దోఁగులాడ

ఈ చరాచరప్రకృతిలో నేది నిత్య
మే దనిత్య ? మెయ్యది నిజ ? మేది కల్ల ?
భ్రాంతిఁ జిక్కిన మిథ్యాప్రపంచరీతి
తలఁపఁ జిత్రవిచిత్రమౌ కలగఁ దోఁచు.

తల్లిదండ్రు లనుచు దార సుతాదులు
బంధుమిత్రు లనుచు భ్రాత లనుచు
భ్రాంతిఁ జెంది వెఱ్ఱిపడుచు ననిత్యమౌ
బ్రతుకు బ్రతుక నేమి ఫలము ? ప్రజకు

ముసురుకొనెడి దిగుళ్లతో, ముంచి తేల్చు
కష్టసుఖములతో దినగండమైన
యీ భయానక జీవిత మీడ్చి యీడ్చి
కడకు సాధించు నుత్తమకార్య మేమి?

ఎచటఁ జూచిన హత్యలే, యెచటఁ గనిన
దూషణలె యెందయిన ధర్మదూరులైన
మనుష్యులె, జిత్తులను బన్ను మోసగాండ్రె
యేమిలోకము! కటకటా! యేమిబ్రతుకు!

పాపపుణ్యములను బదాబదలు చేసి
నీతి నిలువెత్తుగోతిలోఁ బాఁతిపెట్టి
సత్యధర్మ విహీనులై జనులు నేఁడు
బ్రతుకుచున్నా రజ్ఞానపథము ద్రొక్కి

పాడిదప్పి యుక్తులుపన్ని లోకులకంట
దుమ్ముగొట్టి ధనము దోఁచి భోగ
ములను బెంచి స్వార్థమున మున్గి మానిసి
వాడియుఁ గడకు నీటి బుడగ పగిది

తావు లెగఁజిమ్ము చక్కని పూవుఁదోఁట
ప్రళయ ఝంఝానిలుఁడు కూల్చు పగిది మిత్తి
గర్జమ్రోగించి పచ్చని కాఁపురములు
కూల్చుఁగద! బంధుమిత్రులు గోడుగుడువ

భూరిసంపదఁ దులఁదూఁగు భోగియోని
కడుపుఁజిచ్చునఁ గుములు బికారిగాని
సములె భూపతీ! భస్మరాజ్యంబు నందుఁ
గాలు మోపిన యంతిమక్షణమునుండి

కనులు తెఱవని కూనయుఁ గామమోహ
ములఁ దగుల్కొన్న యువయును ముదిమి నేలు
ముసలివాఁడును గాటికాఁపురముఁ జేయ
నరుగుచున్నార లెంతయబ్బురము! రాజ!

కావ్యగరిమ విశ్వకల్యాణ సిద్ధికిం
బంచి శాస్త్రముల రచించి సాహి
తీ మహిమ్ములైన దిగ్గంతు లెందరో
ధరణిగర్భమందు దాఁగినారు

కటికజాతికి రూపరేఖలను బాపివి
దివ్యసుందరమూర్తిగా దిద్ది తీర్చు
శిల్పసిద్ధుల నగిషీలు చెక్కు నుబుబు
క్రుగ్గుచున్నవి జీర్ణసమాధులందు

నేలవాలుగు చెఱఁగుల నేలినట్టి
సార్వభౌములు, విజ్ఞానశాస్త్రఖనులు,
కవులు, శిల్పులు, గాయకప్రవరులెల్లఁ
గన్నుమూసిరి మృత్యువుగర్భమందు

పాంచభౌతిక మాయాప్రపంచమునకుఁ
దరలివచ్చెద రెందరెందరో వినోద
యాత్రకై : యొక్కరొక్కరే యాత్ర ముగిచు
వెడలిపోదురు మెఱి వారి కెడ మొపంగి

సహనంపు మొదవె నునున సాహసరతా
భాషితం బొకండు బయలుపఱతు
నింతదనుక మీా రసంతభక్తి భజించు
మాత మిమ్ముఁ గన్నమాత కాదు

జనని మిముఁ గన్న నోఁడన దినముగఁ బె
తనువు చాలించె లుంబికాననమునందుఁ
ప్రేమ పెంపెసలార మీా పిన్నతల్లి
దిద్దై నదిసుత గౌతమీాదేవి మిమ్ము

ఈ విపత్తు నిరోధింప నేరికేని
సాధ్యపడదు; మహావనత్మ్రధరముల
దరులఁ బర్ణాంబుభక్షులై తప మొనర్చు
తాపసులకైన మరణంబు తప్పఁబోదు

వినుచుకొలఁది మోము వెల్లనై తేజంబు
నుడిగి డీల్పడంగఁ బోడఁగె తేఁడు
విరిసి కమ్మ్రతావి విరఁజిమ్ముకుసుమమ్ము
భానుదీప్తిఁ గమలఁ బాఱుభంగి

మధుర భావవీధి మసలు నాతని హృది
తప్పపాటులోనె కుప్పఁగూలెఁ
దేజులను వెలిల్చి వేసు చెన్నుఁగను రాచ
నగరు చేర వడిగ నడపుచుండె

పోవు తెరువు నంటి పొడచూపె రాజున
కగ్ని వేల్చుచున్న యాజ్ఞికుండు.
వేదములను గ్రోల్చు విప్రులు, బలినీయ
యూపమున బిగించి యున్న యజము

సంజ్ఞచేసి నృపుఁడు స్యందన మాఁపించి
క్రతువిధాన మెల్లఁ గాంచుచుండె
నగ్ని ప్రజ్వరిల్ల నాజ్యధారల నింపి
ఋక్కులను బఠించె ఋత్విజుండు

వేదఘోష నణఁగి వినిపింప దక్కటా!
మేకపోతురవళి మెడను నులుమఁ
బదనుకత్తి చేతఁ బట్టి యత్తఱి హోత
వపను దీయఁగా నుపక్రమించె

కలఁత కేఁగి కేఁగి గౌతము నెడఁదలో
బ్రద్దలయ్యె నగ్నిపర్వతంబు
చేష్ట లుడిగి మూర్ఛచే సొమ్మసిలె నిజ
స్యందనమున రాజనందనుండు

# మ థ న ము

తలఁచినది వేఱు, నగ్న సందర్శనమునఁ
దెలిసినది వేఱు; దీనిలోఁ దెలియరాని
పరమ సత్యము గూఢమై భ్రాంతి దవిలి
నడపుచున్నది జీవితనాటకంబు

ముప్పదేండ్లు కనులఁగప్పిన యజ్ఞాన
మంతరించి జ్ఞాన మంకురించె
నలముకొన్న మేఘములు విచ్చి వెన్నెల
వెలుఁగు లలమె మనసు పులకరించె

సుందరోద్యాన వనమున నందమైన
కేళికామందిరమున సఖీజనంబు
కొలువఁ బ్రియురాలి వాలుఁజూపులకుఁ జిక్కి
భోగలాలసజీవినై బొందఁబడితి

కేకిముద్దుల నాట్యంబు, కోకిలమ్మ
మధురగానంబు, జనరాలిమందహాస,
మంగనల సరసోక్తుల రంగరించి
మత్తుచల్లెను జనకుండు మాయపన్ని

పురము తిలకించు నాకాంతు పొడమనేల
పొడమెఁబో! తండ్రి యను మాట నిడఁగనేల
ఱాపెనుబో! మృత్యుదేవత యెదుటనిలిచి
గజ్జె మ్రోయించి నాహృదిఁ గలఁచుటేల ?

బళిర! యెంతటివైరాగ్య మొలుకఁబోసి
జీవిముద్దశ వర్ణించి చెప్పెఁ జెన్నుఁ;
డద్దిరా! దుర్మదాంధుఁడనై జగంబు
తీరుతెన్నులు గానక దేబె నైతి

పగఱచేఁ జిక్కి ధృతిని గోల్పడినవఁజోదు
మగఁటిమి విశీర్ణమై చెఱ మ్రగ్గుకరణిఁ
బండిబ్రబ్బిన మత్కళాప్రాభవమ్ము
నాల్గు బురుజుల బందిలో నవసిపోయె.

చదువుకొంటి సమస్తశాస్త్రముల, నల్లె
వేసితిని ధర్మపన్నాలు వేనవేలు,
నేర్చితిని సత్యసూక్తులు, నేరనైతి
జనన మరణ రహస్యభాజన చరిత్ర

నిత్యసత్య మదిగో నిలిచె ముంగిట; దీని
మఱుఁగు పఱుప నెవరితరముఁ గాదు
మృత్యువును జయించు సత్యంబు; సత్యమే
నిత్యమైన బ్రతుకు నిత్య మగును

పుట్టలోనఁ జెదలు పుట్టి గిట్టినయట్లు
పుట్టనేల నరులు గిట్టనేల
తనుచుకొలఁది నేదొ యెఱుఁగని తత్త్వంబు
కలఁచుచుండె మేను తొలుచుచుండె

ఎఱుక లేదు జీవి కిసుమంత మిథ్యాప్ర
పంచ మోహపాశ బద్ధుఁ డగుటఁ
గనులు తెఱచి సత్యమును గని జ్ఞానంబు
వడసి భ్రమను విడిచి నడచుదనుక

ధర్మబుద్ధి లేని ధన మేల ? శాంతికి
నెలవు గాని స్వర్గనిలయ మేల ?
ప్రేమలేని జాతి పెంపేల వైషమ్య
ములు వెలార్చు జగతి నిలుప నేల ?

ఎంతఘోరకృత్య! మీ మూగజీవులఁ
బట్టి యజ్ఞశాల బలియొనర్ప
నార్షధర్మ మింతయలఁతియా? స్వార్థంబు
వలచి కులుకు ఖలుల తలఁపు గాక

పుణ్యలోక వాంఛ పొడమినవిప్రులు
జపమొ తపమొ చేయఁ జనును గాని
జంతుహింస చేయఁ జనునోకో! జన్నమన్
పేరు పెట్టి పాపభీతి నెట్టి

అక్కటా! మదాత్మ సర్వభూతాత్మ యనుచు
నీతి సూక్తుల వల్లించు నేల వేల్పు
కటిక చండాలురీతి యజ్ఞముల నితఁడు
మేషములఁ జంపఁదగునె దుర్దోష మనక

జీవహింస నెఱప సిద్ధించునంట సుర
రాజ్యమందు నప్సరసల పొందు
హింసఁ దెగడువారి కెదురౌనె నరకం? బి
దేమి యద్భుతం బి దేమి మతము ?

"ఆత్మవత్సర్వ భూతాని" యని వచించి
యాత్మయే దైవ మని, దానియందె యిమిడి
యుండె లోకంబు లని నీతు లుగ్గడించు
ప్రాజ్ఞులే జీవహింస చేపట్టనగునె ?

పాడిదప్పిన నరపతి పాలనంబు,
స్వార్థమున కంజలించు శాస్త్రంబు, ధర్మ
మురిగి యజ్ఞానమునఁ గోడుగుడుచు జగము
చక్కఁబడునొకో ! తగినసంస్కార లేక

స్వార్థమున కొగ్గు మానవుం డడఁగువఱకుఁ
బడుగుబిడుగుల హరింప సంబరముఁ జెందు
స్వార్థరహితుఁడు జంటికై వడి శ్రమించి
కష్టముఁ దీయనిదిందు లోకులు సుఖింప.

పరసుఖంబు వలచి బహుభంగుల శ్రమించుఁ
బరహితంబుకొఱకుఁ బ్రాఁకులాడుఁ
బరులసేవఁ జేయుఁ బరవిత్తమును రోయు
స్వార్థరహితుఁ డైన యట్టిసుకృతి

ఉత్తమగుణంబు లివి మహోదాత్త చరితు
లనుమతించు పవిత్ర కార్యంబు లివి, స
మాజమునకు మహాత్ము లుత్తేజ మిడఁగ
వ్రాసిపెట్టిన ధర్మసూత్రమ్ము లివ్వి

ఆఁకటఁ గృశించుబడుగుల కన్న మొసఁగి
యాపదలఁ గ్రుంగునార్తుల నాదరించి
రుగ్ణత నలంగుప్రజల కారోగ్య మిచ్చి
జాతి నలరించు సతము నిస్స్వార్థజీవి

సార్వభౌముఁడేని సన్న్యాసి యేని ద
రిద్రుఁడేని సచ్చరిత్రుఁ డేని
లోభియేని దానలోలుఁడే ధనియేని
సముఁడె స్వార్థరహిత సజ్జనునకు

ధనము గోరఁడు కలిగినదానితోనె
తృప్తిపడు న్యాయమార్గ విధేయుఁడై స
తమ్ము శాంతి దయా సత్య ధర్మ గుణ వి
భాసియై స్వార్థరహితుండు ప్రజ్వలించు

ఈ పవిత్రగుణములే శరణ్యము, లస్మ
దీయవాంఛితం బిదే, సమస్త
జగము దిద్ద దివ్యసందేశ మియ్యదే
మనుసరింతు దీని నాచరింతు

ధర్మదూరులు ధూర్తవర్తనులు కుటిల
మానసులు నీతిబాహ్యులు జ్ఞానహీన
నరపిశాచులు చెఱలాడు నరకసీమ
నిలువ నొల్లదు మన సౌఖ్యనిమిష మేని

తాతముత్తాత లెందఱో ధరణి నేలి
బడలి శాశ్వతవిశ్రాంతి పడసినారు
గాని యొక్కఁడు మోక్షమార్గంబు దెసకుఁ
గాలుమోపి యెఱుంగ రేకారణంబొ?

రాజ్యతృష్ణ బలిసి రక్తాన్న మాసించి
రణ మొనర్చి నిరపరాధజనులఁ
గాల రాచి క్రూరపాలన సాగించు
నృపుల మార్గ మనుసరింప నొల్ల

ధర్మచింతన సాధువర్తన దయా స్వ
భావవిరహిత స్వార్థప్రపంచమునకు
నంజలి ఘటించి దారసుతాది బంధు
వుల విసర్జించి చనెదఁ గానల వసింప

# నిర్ణయము

క్రమ్ముకొన్నవి జీవితాకాశమునందుఁ
గాఱుమబ్బులు మార్గంబు కానరాదు;
పిలుచుచున్నార లెవ్వరో పేరుపెట్టి
వేదనల సతమతమయి వేఁగునన్ను

తెలియరా దీప్రయాణమ్ము తెడ్లు వేసి
నడుపుచున్నాఁడు నౌకను నావికుండు
చెల్లరే! యెన్ని మజిలీలు చేరవలెనో
దారి నెమకుచు గమ్యంబు దఱియుదనుక

ఏ చెడితుఫానులోఁ జిక్కి లేచియాడు
నలల తాఁకిడి కూఁగిసలాడి నౌక
కూలిపోవునో ముక్కలై కుప్పగూలి
చెక్కుచెదరక గమ్యంబు చేరుకొనునో

చిమ్మచీఁకటిముసుఁగులోఁ జేరెఁ బ్రకృతి;
గాఢనిద్రాణ మయ్యె లోకమ్ము; రాజు
క్రుంకెఁ గనువిప్పెఁజుక్కలగుంపు; వీవ
సాగె మలయానిలుఁడు సువాసనలసుగటి

తల్లియురము నంటి దాఁగిలి సూఁతల
నాడి యాడి పాల నారగించి
మొదలు మఱచి రాహులుఁడు యశోధరాసాను
వులను జేరి నిదురవోవఁ దోఁగె

చిన్నిబిడ్డను గౌఁగిటఁ జేర్చి జోల
పాడి యానందఝరి నోలలాడి యాడి
వలపుతలఁపులఁ దీయనికలలఁ దేలి
సోలి శయనించె లలితాంగి పూలసెజ్జ

మంచుమలల చఱియలంచు లొరసి ప్రవ
హించునదుల స్రోఁతలినుమడించె
మాఁటుమణఁగెనగరు, కోటకవాటముల్
ప్రామి రిపుడె రాజభటులు కవిసి

అలంతి పుల్గుల గొంగలు నుఱుము ఘూక
ములు బయల్వెడెఁ గోటరములఁ ద్యజించి
మింట విహరించు తీతువుజంట లేఁగి
యఱవఁగాఁ జొచ్చెఁ గుత్తుక లదిమి పట్టి

దాఁకె నడిరేయి వినువీథిఁ దారసిల్లెఁ
దెరలఁబాఱున మబ్బుదొంతరలు చెదరి
రాజ్యమును వీడి దుర్గమారణ్యభూమి
నడుగువెట్టెద తృణమేని తడఁబడఁబోక

## సంఘర్షణ

అని తలంచు గౌతమునిడెందము ద్విధావి
భక్తమయ్యె, నిహము నలచు నొకటి,
యొకటి పరము వలచు, నొకటిసిద్ధార్థుఁ, డిం
కొకటి బుద్ధుఁ డగుచు నుగ్గడించు

సిద్ధార్థుఁడు

ఆఁగు మాఁగు దయారహితాత్మ! యాలు
బిడ్డలను ద్రోసి రాజ్యంబు విడిచి ప్రజలఁ
బాసి గహనాంతరముల సన్యాసివై చ
రింతువా ? ఘోరతప మాచరింప నెంచి

తల్లి దండ్రి యొజ్జ దైవమ్ము సర్వమ్ము
నీవె యని తలంచి యింతదనుక
నమ్మి కొలుచు సతిని నట్టేటిలో ముంచి
పాఱిపోయి దాఁగ భావ్యమగునె?

ఏమియపచార మొనరించె నీమె? లేను
కింత క్రూరశిక్షను విధియింప దగును
సమ్మతించునె? న్యాయశాస్త్రంబు తీర్పు
చెప్పునే? నీవు నిర్ణయ మొనర్పుటంచు

అగ్నిసాక్షిగఁ బరిణయమ్మాడి ధర్మ
పత్నిగా నీవ సగాలు పంచి యిచ్చి
మున్నుముచ్చట తీఱకమున్నె రోసి
యిడుము జత్తైన నేమివల్లఁడి ఘటిల్లె ?

తల్లిదండ్రుల స్వజనులబాంధవుల వీడి
నిన్నె దైవస్వరూపుఁగా నెన్ని సతము
గొలుచు భార్యను నిలువున గొంతుఁగోయఁ
దెల్పునా సుంత యోజించి చెప్పు స్వామి!

నల్లనివి నీళ్ళు తెల్లని వెల్లఁ బాలు
గాఁ దలంచుసుశీలను గల్ల కపట
మింత యెఱుఁగనిసతి నమాయకను మోస
పుచ్చి ముష్కరుఁగా నడవికిఁ బోవఁదగునె?

భావిభూపాలకుని రాణి పరమసాధ్వి
యక్కటా! భర్తృదూరయై దిక్కుమాలి
వెతల సతమతమయి కన్నసుతుని బాసి
యసువులను వీడ నెంతదుర్యశము తపసి!

పట్టు విడనాడు వేగిరపడకు వెఱ్ఱి
మొఱ్ఱియాలోచనలు త్రోసిపుచ్చి యుంచు
వెనుక లారసి నిర్ణయమ్మును సడల్చి
సాగిపోనిమ్ము సంసారజలధియాత్ర

బుద్ధుఁడు

చాలు నీకుఁ గట్టిపెట్టు రాజా! త్వదీయ
నీతిసూక్తుల; నియ్యవి నే నెఱుంగ
నా? పదేపదే వల్లింపనగునె? జ్ఞాను
లాలకింతురె వ్యర్థంబు లైనసుడుల

అసదృశాంబరచుంబి సౌధాంతరముల
భోగనిరతిని జవరాండ్రపొత్తు దవిలి
భవపరంపర నూడ్చు కైవల్యసుఖము
వెట్టఁబుచ్చఁగ భావ్యమా వెఱ్ఱితండ్రి!

బ్రతుకుదాఁకఁ బ్రేమబంధమ్ములోఁ జిక్కి
యాలు మగఁడు నొక్కఁడై చరింత్రు
మరణ మొదవ నెవరి తెరువు వారిదె దీని
కింతమమతఁ జెందనేల బుధప!

ఆలు బిడ్డ యనుచు నల్లాడదేల యీ
యాలుబిడ్డ లెవ్వరయ్య! నిన్నుఁ
బీల్చి పిప్పిచేసి పీడించు జలగలు
కారె? నిక్క మరయఁ గనుఁగుమయ్య!

తగదు నిలువరించు తలఁపు; శాంతికిఁ దిలో
దకము లిచ్చు మాయదారి బ్రతుకు
భారమయ్యె; నింక బాధింప; కజ్ఞాన
పథము దాఁటి వెలుగుబాట గనెద

సిద్ధార్థుఁడు

వెఱ్ఱిమొఱ్ఱి వేదాంతమ్ము విస్మరించి
కన్న కొమరుఁడు, భార్య, లోకమ్ము మెచ్చి
కొలువ, జనకుండు మోదాశ్రువుల శిరంబు
నిమిరి దీవింప రాజ్యభారము వహింపు

చిలిపిచేష్టలు లేఁతనవ్వులు వెలార్చు
పాలబుగ్గల చిన్నారి పాప నిన్నుఁ
గా భ్రమంపడి తలగడఁ గౌఁగిలించు
నక్కటా! చూడు మీదృశ్య మార్ద్రమతిని

కోటగడప నీవు దాఁటినక్షణమందె
ప్రకృతి జలదరింప బాష్పవృష్టి
వెల్లువై పురంబు పెల్లుగా విలపించుఁ
దగునె బెడఁద గూర్పనగునె ప్రజకు

ప్రభువు మతిసెడి మంచముపట్టు, భార్య
కుమిలి కుమిలి దుఃఖాగ్నిలోఁ గూలి పోలుఁ
దండ్రిలేని యభాగ్యుఁడై తనయుఁ డేడ్చు
నీయుదంతంబు విని యెవ్వఁడేని నగరె?

అమ్మలేనివెలితి నణఁచి రేయుం బవల్
కంటిరెప్పపగిదిఁ గాచి పెంచి
పెద్దచేసి పెండ్లి పేరంటములు దీర్చి
మరియు తండ్రి బ్రతుకు నరయవలదె

ఏ మహీనేత కోసలకేగె రాజ్య
భార మూనక వైరాగ్యపథము ద్రొక్కి
యిట్టిదుర్బుద్ధి నీ కేలపుట్టెఁ బాబు
స్వార్థవిరతుఁడా! లోనికి సాగి రమ్ము

బుద్ధుఁడు

రాజ్యకాంక్ష సడల్చి స్వార్థము విడల్చి
కట్టుగుడ్డల నేకాకిగా నుదగ్ర
భూధరఝరీతటస్థ తపోవనాంత
రముల కేగుట స్వార్థమా? రాకుమార!

వేయిమాటలేల విను ధరాధిప! యుష్మ
దీయవాంఛితంబు తేటపఱతు
నిలువఁజాల నొక్కనిముసంబు నిటఁగరు
ణించి నన్ క్షమింపు మీసుపడక

కాలహరణ మాయెఁ గర్తవ్యమును విస్మ
రించినాఁడ గొడవ పెంచినాఁడ
వంక లేవొ వెదకి కుంకిళ్లు వెట్టకు
నన్ను విడువు నీకుఁ బున్నె మొదవు

## సి ద్ధా ర్థుఁ డు

కుడువఁ గూడు కట్టుకొనఁ బుట్టము వసింపఁ
గొంప లేక వెతలుగుడుచు బడుగు
సన్న్యసించుఁగాక సంపదలన్ దేలు
భోగి కీ విరాగి బుద్ధి యేల

ధర్మపాలనంబు దయ మానవప్రేమ
త్యాగనిరతి శాంతి దాంతి యున్న
జపతపంబులేల స్వామి! చక్కనిమార్గ
మనుసరింపు మోక్షమభిలషించి

అతిథి కభ్యాగతునకు నాదృతి వెలార్చి
దానధర్మాదికములఁ బేదలను దనిపి
మధువుఁ జిలుకు గృహస్థాశ్రమమును మించు
నాశ్రమం బేమికలదు మహానుభావ!

ఎవరు చెవిని వైచి రీతియుమంత్రంబు
మంకుపట్టు విడని మాయ పన్ని;
చెప్పి చెప్పి నోరునొప్పి పుట్టెను గాని
గోరెఁ డైన మనసు మాఱ లేదు

## బుద్ధుఁడు

ఒకరు నుడువనేల సకల చరాచర
ప్రకృతి నిమిడి వెల్గు పరమసత్య
మనఘ! తరుణ మొదవ నఁటె బయల్పఱు నుసి
పొర తొలంగ నిప్పు మెఱయు కరణి

తమ్మిపూఁదేనె కడుపుబ్బఁ ద్రావి భ్రమరి
పారవశ్యమునం దోఁగి పాట పాడు
వికచ పుష్పసుగంధముల్ వీవ మురిసి
తేటి పుప్పొడిజల్లులఁ దేలియాడు

తలఁపు లూరించు నవవసంతమున కుబ్జ
గొంతు సవరించి చల్లగాఁ గూయుఁ బికము
తొలకరి మొయిళ్లరవళి వీనులకు సోఁక
నెమ్మి పురివిప్పి వలపునాట్యమ్ము సలుపు

బాలరవిరశ్మి సోఁకి విప్పారి నవ్వఁ
గనులు జిక్కించి చిలిపిగాఁ గమలబాల;
నిండు చందురుఁ డుదయాద్రి నిలిచి పిలువ
నవధి విడనాడి మిన్నంటు నబ్ధిరాజు

శిశిరమున మ్రోడువడి చేవచెడినరీతిఁ
గోఁచువృతుములు వసంత నేఁచివంతఁ
దలిరుటాకుల,రంగురంగులు విదుల్చు
విరుల, కాయల, పండ్లతో వెల్లివిరియు

సెగలపొగలగాడ్పు లెగఁబోయు గ్రీష్మాత
పముల డిల్లవడిన ప్రాణికోటి
జలధరములు మొరసి జడివానజల్లుల
ముంప నందచందముల నెసంగు

కడుపుమంటలతో శరత్కాలమందుఁ
గ్రొత్త ప్రాఁతలసందునఁ గుములు పేద
మానసము శాంతి నంద హేమంతఋతువు
క్రుమ్మరించుఁగదా సరిక్రొత్త పంట

ప్రకృతిశాసన మిది పరంపరగ నడుచు
ధర్మమిది; మాఱ్పులేనియథార్థ మిది; మ
హాత్మ్య మని చెప్పు సృష్టిరహస్య మిది గ్ర
హింపు కపటములను విస్మరింపు మధిప!

ప్రకృతియందె జీవి ప్రభవించుఁ బ్రకృతియే
పెంచి పెద్దచేసి ప్రేమించుఁ గడకుఁ
బ్రకృతియాజ్ఞ మీఱ భావ్యమా? ప్రకృతియే
పిలుచుచున్న దదిగొ నిలిచి విన్ము

ఈరహస్యభావ మెఱుఁగనియజ్ఞాని
విషయవాంఛఁదగిలి వెతలఁ బొగులుఁ
దమ్మితేనెయాసఁ దుమ్మెద ముకుళించు
సరసిజమున ప్రగ్గు చందమునను

## సిద్ధార్థుఁడు

మురపుఁదనమున నేనేమొ తూలనాడి
దోసఁగు చేసితిఁ బెడదారిఁ ద్రొక్కి నీకుఁ
జ్ఞాన ముదయించె నణఁగె నజ్ఞానతమము
వందనం బిదె బుద్ధదేవా! మహాత్మ!

## ప్రకృతి

కల్లబొల్లికథల నల్లి సత్యంబును
మఱుఁగుపఱచి మాయమర్మములను
బెంపుసేయువారి పిడివాదము నశింపఁ
దరలుసిద్ధ! స్వాగతంబు బుద్ధ!

# ఫలితము

రాచపుట్టువు పుట్టి సామ్రాజ్యవాంఛ
నవల నెట్టి తపస్సుకై యడవి మెట్టి
శాంతిమాతగా జగములఁ జక్కఁదిద్ద
మగిడి యేతెంచితివె! గౌతమా! మహాత్మ!

శుద్ధచరిత! నీయహింసాపథము ప్రాక్క
దేశదేశములు ప్రశస్తి నొందె;
పులులు మేఁక లొక్క శాలనిలోఁ గేళిసల్
కొట్టుకొనుచు జలము క్రోల నేర్చె

నీ యహింసావ్రతమ్ము మన్నించి దేవ
కాంద్రుకాంద్రను క్రోల్పులి, గర్జసల్పు
కొదమసింగము, ఖడ్గాదిక్రూరమృగము
లాఁకటి నడంప మేసెఁ దృణాంకురములు

నీ పవిత్రాశయముల గణించి స్వామి
భరతభూమిని ధార్మిక ప్రగతి గాగ
ఖండఖండాంతరాల్ నీ యఖండశక్తి
కంజలి ఘటించి ప్రణుతి నీయనుగులంను

బుద్ధదేవ! నీవు పుట్టినగడ్డపై
గర్తిమూల లేదు కటికవాఁడు
చెలిమిఁ జేసెఁ గప్ప చిలువతో; జన్మంబు
నెఱుప నిష్ఫ్రగింపమనమఁటె లేఁడు

ఉగ్రతపముఁ బూని యుసురు గోల్పడుతఱి
జాలి కగ్గపడి సుజాత నీకుఁ
బాయసంబు నొసఁగి బ్రతికింప కున్నచో
స్వామి! నీచరిత్ర సమయకున్న?

ఈ పరోపకారమే బౌద్ధమత మహా
యుగము సృష్టిచేసె, నుర్వి నెల్ల
శాంతిసత్యధర్మసంస్థాపన మొనర్చె
సచ్చరిత్ర రూపా సుజాతకరుణ

క్ష్మా విభుండు బింబిసారుండు వెఱఁగంద
యజ్ఞవాటి నిలిచి ప్రజ్ఞ మెఱసి
జంతుహింస మాఁచి జయపతాకను నలు
దెసల నెగురవైచితే! మహాత్మ!

ఓమహామునీ! మహీమండలంబెల్ల
నలముకొన్న నీమహామతంబు
హింస శొగ్గి నలఁగి యేడ్చు రాజన్యుల
నుద్ధరించె శాంతి యొసఁగి పోసఁగి

దారిగొట్టి బ్రదుకు తస్కరుఁ డేని హిం
సాప్రవృత్తి గల కసాయి యేని
స్వామి! నిన్నుఁ గన్న క్షణమందె యుత్తమ
జ్ఞానియై కుబుద్ధి మానుఁగాదె

దురితదూర! నీవు దుఃఖమయం బీప్ర
పంచ ముద్ధరింప నెంచి బోధి
తరువుకడ వసించి తత్త్వార్థములను గ్ర
హించి ముక్తి నందితే! మహాత్మ!

పూతచరిత! నీదు బోధామృతము గ్రోలి
పతితజాతి ధర్మపథము ద్రొక్కె
ఖలులు సురాపానరతములు వెలఁగి సద్గుణముల
సంతరించుకొనిరి శాంతిమూర్తి!

ఓ మహాతపస్వి! యుష్మదంఘ్రిద్వయ
పూజ సలిపి పాపపూరుషుండు
జ్ఞానియై వివేకఖని పవిత్ర శీ
లానురక్తుఁ డగుఁ గదా! మహాత్మ!

ధర్మమూర్తి! నీసుధామధురోక్తుల
నాలకించి లక్షలాదిజనము
లనుదినంబు నీమహామత సేవకై
చేరి శాంతయోగసిద్ధి నిడి!

రేగ నీయస్థులను సేకరించు కొఱకు
ఘోరసంగ్రామములు మహాభారతమున
వెలసె నీ స్మృతిచిహ్నముల్ విశ్వమెల్ల
నమృతమూర్తివి నీవు నీ కంజలింతు

నీపవిత్రమతమునే స్వీకరించి నీ
ధర్మసూత్రములె సదా పఠించి
నీప్రశాంతమూర్తినే సంస్మరించి ధ
న్యాత్ము లైరి ప్రజ లుదాత్త చరిత!

ధర్మచక్రంబు నిల్పి బౌద్ధమును గొల్చు
యతులు నిల్చుట కారామతతి సృజించి
నలుకెలంకుల నీ మహోజ్జ్వల మతంబు
ప్రాకఁజేసె నశోక సమ్రాట్టు స్వామి!

తండ్రి పినతల్లి భార్య నందనుఁడు కఠిన
నియమముల లెక్కసేయక నీ మతంబు
స్వీకరించిరి శిష్యులై మోకరిల్లి
రెంతవింత! మహాప్రభూ! యీమహత్త

ఔర! యానందుఁ డెంత మహానుభావుఁడో
యంత్యదశ నిన్నుఁ గొలుచు భాగ్యంబు వడసె
నీచరమవాణి జగతి కందించి విరిచెఁ
దండ్రి! నమ్మినబంటు కదా! యతండు

సత్యవాది సచ్ఛాస్త్రసంపన్న సాధుశీల
ధనుడు నాగార్జునుండు మహా క్షేసంబవిష్ఠ
కృష్ణవేణీ తటిని వెలయించె మున్ను
విజయపురి నీ మతంబును విస్తరింప

శాతవాహను లాంధ్రదేశమ్ము నేలి
భట్టిప్రో లమరావతి పట్టణములఁ
బానుకొల్పిరి భవదీయ పావనాస
శేషములతోడ స్తూపముల్ శిల్ప మలర

ఈవు చని యైదువందలయేండ్లు జరుగఁ
బొడమె నీవంటి కారుణ్యమూర్తి యేసు
ప్రాచ్య పాశ్చాత్య దేశముల్ ప్రణుతి సేయ
నీయడుగు జాడలఁ బయనించె సతతము

సత్యమునకు నహింస కాస్థాన మనఁగ
నవతరించినవాఁడు మహాత్మగాంధి
పతితమానవజాతి కున్నతిని గూర్పఁ
బ్రాణములు సమర్పించె నీవలె నితండు

అనఘ! భవదాశయమ్ముల ననుసరించి
పంచశీల విధానంబు పాదుకొల్పి
విశ్వశాంతికిఁ దనదు జీవితమొసంగి
చనియె జవహరలాలు యశస్సు గాంచి

గాంధిశిష్యులలో నగ్రగణ్యుఁడగుచు
నిన్నుఁ గొనియాడు వారిలో మిన్న యగుచు
జగమహో! యన భూదానసవనదీక్ష
విశ్రమింపఁడు నేఁడు భావేమహర్షి

తెలివిమాలిన భారతదేశమంచు
బదనికలఁగోలెఁ బ్రజలసంపద గ్రసింప
వెలసెవందలు వేలు లక్షలు మతాలు
శిలల మాటున ఖలులకుట్రలు ఫలింప

వేవెలుంగు నభోవీథి వెలయునమక
నీమహోత్కృష్టమతము జీర్ణింపఁబోదు
నిక్కముఁ భయుల్పడిన మఱుగునముసఁ గుండ
బైసిమాలినమతములు బ్రతుకఁబోవు